ఈ పుస్తకము 10 వేల కాపీలకు అగు ముద్రణ ఖర్చులను శ్రీ కపూర్‌చంద్ శ్రీమల్‌గారు భరించి సర్వోదయ సాహిత్య ప్రచారాభివృద్ధికి తోడ్పడిరి. వారికి మా కృతజ్ఞతలు.

ఇట్లే ఇంకనూ దాతలు ముందుకు వచ్చి ఒకొక్క పుస్తకము ముద్రణ ఖర్చులను భరించి, తోడ్పడి ఈ యుగ కార్యమును పురోగమింప జేయవలసిందిగా ప్రార్థించుచున్నాము.

రామకృష్ణధూత్,
సంచాలకులు.
స. సా. ప్ర. సమితి.

# వర్తకులకు పిలుపు

*

మూలం

వినోబా

*

అనువాదం

లవణం

సర్వోదయ సాహిత్య ప్రచార సమితి
గాంధీభవన్, హైద్రాబాదు.

ప్రకాశకులు :
అఖిలభారత సర్వసేవాసంఘ పక్షమున
సర్వోదయ సాహిత్య ప్రచారసమితి
సంచాలకుడు :
శ్రీ రామకృష్ణ ధూత్
గాంధీభవన్ :: హైదరాబాదు.

★

రెండవ ముద్రణ
ఏప్రిల్, 1957
ప్రతులు : పదివేలు
మొత్తం అచ్చయిన ప్రతులు : 20 వేలు
వెల : 15 నయాపైసలు

★

ముద్రణ :
అజంతా ప్రింటర్సు
సికింద్రాబాదు.

# वर्तकुलकु पिलुपु

विनोबाजी का
'व्यापारियों को आवाहन'
का
तेलुगु अनुवाद

अनुवादक : लवणम्

★

दूसरीबार : १०,०००
कुल छपी प्रतियाँ : २०,०००
अप्रैल, १९५७
मूल्य : .२५ नया पैसे

★

प्रकाशक :
अ. भा. सर्वसेवा संघके लिये
सर्वोदय साहित्य प्रचार समिति के
संचालक,
श्री रामकृष्ण धूत
गांधी भवन, हैदराबाद.

★

मुद्रक :
अजन्ता प्रिण्टर्स, सिकन्द्राबाद.

## ముందుమాట:

1956 మార్చి 24, న ఆదోనిలోని బహిరంగ సభలో ముఖ్యంగా వర్తకుల నుద్దేశించి వినోబాజీ యిచ్చిన ఉపన్యాసాన్ని ఈవిధంగా పుస్తక రూపంలో ప్రచురిస్తున్నాము.

ఈ ఉపన్యాసం ఉపన్యాసం మాత్రమే కాదు; భూదాన, సంపత్తిదాన యజ్ఞముల ప్రణేత యగు వినోబాజీ ఇందు తన హృదయాన్ని విప్పి చూపారు. మాట్లాడుతూ మాట్లాడుతూ మధ్యలో గాంధీజీ ప్రసక్తి వచ్చినప్పుడు ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి. ఐదు నిమిషాల వరకూ ఆయన కంఠం మూగవోయింది.

మనదేశ వర్తకులు వినోబాజీ యిచ్చిన ఈ పిలుపును అందుకుంటారనీ, ముందుకు వచ్చి దేశాన్ని, ప్రపంచాన్ని రక్షిస్తారనీ మా నమ్మకము. కరుణా రాజ్యాన్ని స్థాపించే అవకాశాన్ని చేయినుంచి జారవిడుచుకోరని విశ్వసిస్తున్నాము.

—ప్రకాశకులు.

# ధనికులు సంపదకు ట్రస్టీలు కావాలి

సమాన పంపిణీ సిద్ధాంత ప్రకారము ధనికులు తమవద్ద తమ పొరుగు వారికంటె ఎక్కువ ధనమును ఉంచుకొన వీలు లేదు గనుక, సమాన పంపిణీ సిద్ధాంతములో ధనికుల వద్దనున్న అధిక సంపదకు ధర్మకర్తృత్వ మనే భావం నిస్సందేహంగా యిమిడి యున్నది. ఇది ఎలా జరుగుతుంది? అహింసామార్గం లోనా లేక ధనికుల సంపదను గుంజుకొనుట వల్లనా? రెండవ విధానంలో సహజంగానే హింస సహాయాన్ని పొందవలసి యుంటుంది. హింసాయుత పద్ధతులద్వారా సమాజానికి మేలు జరగదు. అందు సంపద సంపాదించేశక్తి కలిగిన వారి సద్గుణాల నుండి సమాజం వంచింపబడుతుంది గనుక సమాజం బలహీన మౌతుంది. అందుచే అహింసా మార్గమే ఉత్తమమైన దనేది స్పష్టము. ధనికులు తమ సంపదను తమ ఆధీనంలో ఉంచుకో వచ్చును. తన అవసరాలకు కావలసినంత అందునుంచి అనుభ వించ వచ్చును. మిగిలిన సంపద సందర్భంలో సమాజహిత మును చూచి ట్రస్టీగా పనిచేస్తారు.

—గాంధీజీ.

# వర్తకులకు పిలుపు

## వర్తకము ఒక సువ్యవస్థిత ధర్మము :

వర్తకం ఒక సువ్యవస్థిత ధర్మంగా అంగీకరింపబడిన దేశం ప్రపంచంలో బహుశః యీ దేశమే ననుకుంటాను. నిజాయితీతో వర్తకం చేయాలనే విషయం ప్రపంచంలోని అన్నిధర్మాలూ చెప్పాయి. నిజాయితీ ఒక ధర్మమని, సత్యనిష్ఠ ఒక ధర్మమని అంతటా అంగీకరించబడింది. ఐతే స్వయంగా వర్తకం ఒక ధర్మమనే విషయం నేడు యీ దేశంలోని సమాజం మాత్రమే అంగీకరించింది. సమాజంలోని వ్యవస్థావిభాగము కొరకు వర్తకులు ఒక సువ్యవస్థితవర్గముగా అంగీకరించబడ్డారు. వైశ్యులు వాణిజ్యము చేయుట ఒక స్వతంత్రధర్మమని శాస్త్రకారులాదేశించారు. దీనిని మనదేశంలోనే ప్రత్యేకంగాచెప్పారు.

నిష్కామత్వంతోనూ, అనన్యప్రీతితోనూ వేదాధ్యయనం చేసే వ్యక్తికి యెట్టి మోక్షం లభిస్తుందో అట్టి మోక్షమే నిష్కామబుద్ధితోనూ, సేవాబుద్ధితోనూ వర్తకము చేసే వైశ్యులకూ లభిస్తుందని చెప్పబడింది. ఇది చాలా విశిష్టమైన భావము. ఇందులో సమాజసేవలోని విభిన్నకార్యములకు సమానప్రతిష్ఠ యివ్వబడింది. నిష్కామ, కర్తవ్యపరాయణ బ్రాహ్మణునకు లభించునట్టి మోక్షమే నిష్కామ, కర్తవ్య పరాయణ వైశ్యునకు లభిస్తుంది. ఈ యిద్దరి మోక్షములోనూ

యేమైనా తేడాఉందా? మోక్షములో ఏవిధమైన శ్రేణులు గాని, తేడాలుగాని యున్నవని అంగీకరించజాలము. కర్తవ్య పరాయణుడైన వ్యక్తి వైశ్యుడైనా, బ్రాహ్మణుడైనా క్షత్రియుడైనా, మరెవరైనా అతను నిష్కామముతో సేవచేస్తూ యుంటే సమానమైన మోక్షమే లభించుననే ఈ యోచన అద్భుతమైనది. అంటే సమాజసేవాపరాయణుడగు వైశ్యుడు గాని, వర్తకుడుగాని ఒక సాధకుడుగా, భక్తుడుగా యెంచబడి నాడన్న మాట. భారతదేశంలో వర్తకులకు యింత బాధ్యత, యింతప్రతిష్ఠ ఈయబడింది; ధర్మశాస్త్రము వీని నిచ్చింది. భారతదేశంలో దీనివల్ల చాల పరిణామము కలిగింది.

## మాంసాహార త్యాగము :

భారతదేశంలో ఆధ్యాత్మిక భావనలో దయాభావము విశేష అంశముగా యున్నది. ఇతర ప్రాణుల యెడల మానవ సమాజం ప్రీతిని కలిగియుండాలి అనే విషయం గూడా గట్టిగా చెప్పబడింది. అందుచేతనే యిచటి ప్రజలు అసంఖ్యాకంగా మాంసాహార పరిత్యాగ ప్రయోగాన్ని చేశారు. ప్రపంచంలోని యితర దేశములలో యిట్టి సంఘటన ఘటిల్లలేదు. ఈ రోజుల్లో పాశ్చాత్య దేశాలలో ఈ విషయమై కొన్ని వ్యక్తిగతంగానూ, కొన్ని సామూహికంగానూ ప్రయత్నాలు జరిగాయి. అంటే మాంసాహారాన్ని విసర్జించి శాఖాహారు లనబడే వారి సంఘాలు కొన్ని యేర్పడ్డాయి. ఐతే సమూహాలకు సమూహాలు మాంసాహారాన్ని త్యజించినవి భారతదేశంలో కనబడినట్లుగా యితర

దేశములలో కన్పడవు. నేడు మన సమాజములో యెన్నో దుర్గుణములున్నవి. అందుచేత మాంసాహార విసర్జన యెడల మనకు ప్రత్యేక ఆదరము లేదు. మనకున్న దుర్గుణాలు మనము సంపాదించినవి. దుర్గుణాలను దృష్టిలో పెట్టుకుని భూతదయ నుద్దేశించిజరిగిన గొప్పప్రయోగాన్ని తక్కువఅంచనా వేయలేము.

దయవల్ల ప్రేరేపింపబడి మాంసాహారమును విసర్జించిన సమూహాములలో వైశ్యులు, వర్తకులు యెక్కువ. ఈ అహింస మఱియు దయాభావన విశేషముగా జైనధర్మమందు వ్యాపించి నది భక్తిమార్గము అందుకు ప్రోత్సాహమిచ్చెను. వర్తకవర్గముపై దాని ప్రభావము యెక్కువగా పడిన కారణమున మాంసాహార మును విసర్జించిన వారిలో వర్తకుల సంఖ్యే హెచ్చు. ఇది చిన్న విషయమని మేము అనుకొనుటలేదు. ఒక దేశములోని హెచ్చు సంఖ్య గల వ్యాపారవర్గము దయాభావముచే ప్రేరణ పొంది మాంసాహారమును విసర్జించినారంటే అదిఒకగొప్పప్రయోగము. దాని వెనుక విశేషములైన అనుభవములు దాగియున్నవి. శాస్త్రకారులు వ్యాపారుల యెడల ప్రకటించిన తమ విశ్వాస పరిణామము భారతీయ వ్యాపారవర్గముపై ఈ విధముగాపడినది. అందుచేత భారతదేశంలోని వ్యాపారవర్గంలో దయాభావపు మాత్ర యెక్కువగా నున్నదని అంగీకరించవలసి యున్నది. ఈ విషమావస్థలో చాలామందిలో కాఠిన్యం దాగియుందని గూఢ వెనువెంటనే అంగీకరించవలసి యున్నది. ఈరోజున మన సమాజ నిర్మాణం, ముఖ్యంగా ఆర్థిక నిర్మాణం యెంత తప్పుడుత్రోవలో పోయిందంటే, కోరినా కోరకపోయినా మానవులు కఠినాత్మ

లవుతున్నారు. అందుచేత అందరితో పాటు వర్తకులలో కూడ యెంతో కాఠిన్యం కనబడుతోంది. ఐనప్పటికీ యిచ్చటి వర్తకులలో దయాభావపు అంశము కూడా చాల యున్నదని అంగీకరించవలసి యున్నది.

## దయాగుణ వికాసము :

ఒకవర్గంలో దయాభావపు మాత్ర యెక్కువగా కనబడుతున్నప్పుడు దానివల్ల దేశం ఏమైనా లాభం పొందగలుగుతుందా అనేది ఆలోచించవలసిన విషయం. వర్తక వర్గంలోని యీ ప్రత్యేకత మనదేశపు ప్రత్యేకత అని నేను అనుకుంటాను. ఐతే వ్యాపార వర్గపు రెండవ ప్రత్యేకత వ్యవస్థాశక్తి. ఇది కేవలం మనదేశపు ప్రత్యేకత మాత్రమేగాదు. ప్రపంచములోని అన్ని దేశాలలోని వర్తకులలోనూ ఈ గుణ మున్నది. అంతటా ఉపలబ్ధమయ్యే వ్యవస్థాశక్తి, మనదేశపు ప్రత్యేకతయగు దయాగుణము— ఈ రెండు గుణములు కలిగిన మన వర్తకులు మన దేశము కొరకు ఎంతైనా చెయ్యగలుగుతారు.

దయాగుణము సామాన్యమైన గుణముకాదు. మానవ సమాజానికి దానివిలువ యెంతో యున్నది. దయలేకుండా యే సమాజమైనా ఒక్క క్షణమైనా మనలేదు. పాశ్చాత్య సమాజంలోనూ, భారత దేశ సమాజంలోనూగూడా చాల దయా కార్యాలు నిరంతరం సాగుతున్నాయి. రోగుల సేవ కొరకు ప్రపంచమంతటా సాగుతున్న ప్రయత్నాలన్నీ దయాభావ ప్రేరితములే. కొత్త క్రొత్తరకముల ఆపరేషన్లు అమలులోనికి

వస్తూ మానవునికి సుఖా న్నిస్తున్నాయి. బాధని శమింప జేస్తు న్నాయి. ఇదీ దయాకార్యమే యుద్ధాలలో గాయపడిన సైని కుల సేవకొరకు దయాభావంచే ప్రేరణపొంది సేవకులు వెళ్ళుతున్నారు. సేవ చేస్తున్నారు. ఈ విధంగా జీవితంలో అంతటా ఏదో ఒక రూపంలో దయాభావం కనబడుతోంది. దీనివల్లనే జీవితంలో మాధుర్యం వస్తోంది.

ధర్మశాస్త్రకారులు పరమేశ్వరుని రూపమే దయామయ మన్నారు. ముఖ్యంగా ఇస్లాం ధర్మంలో అల్లాకు రహమాన్, రహీమ్ అనే విశేషణాలు జోడిస్తారు. వాటి అర్థం అత్యంత దయావంతుడు అని. అన్ని ధర్మాలు పరమేశ్వరునిలో ఈ గుణ మున్నదని అంగీకరించాయి. వైష్ణవులు ప్రత్యేకంగా ఈగుణాన్ని మనన స్మరణలద్వారా జీర్ణం చేసుకున్నారు. దయ, క్షమ, కరుణ— యీ దివ్య గుణాలన్నీ మానవునికి నిరంతరము పూజ నీయములే. ఐనప్పటికీ నేడు ప్రపంచంలో కరుణారాజ్యం, దయారాజ్యం లేదని చెప్పవలసియుంది. ఉన్న రాజ్యమల్లా శక్తిది. రాజ్యానికి అధిష్ఠాత్రి దేవతశక్తి. దయ, కరుణ దాసీల రూపంలో పనిచేస్తున్నాయి.

## కరుణ ఎలా పెంపొందుతుంది :

ఏదేశ ప్రభుత్వమైనా తనదేశాన్ని బలవర్ధకంగా చేసు కోవాలనుకునేటప్పుడు కరుణ యేవిధంగా పెరుగుతుంది అని ఆలోచించడంలేదు. సైనిక శక్తి పెంచే విషయమై ఆలో చిస్తోంది. తనదేశంలో కరుణ పెరిగినట్లైతే ప్రపంచ మంతటికీ

శాంతి లభిస్తుందనీ, ప్రపంచ ప్రజానీకమును కారుణ్యగుణం వల్ల జయించ వచ్చుననీ ఆలోచించడంలేదు. మానవునిపై కారుణ్య ప్రభావం యెంతగా పడుతుందో సుస్పష్టం. కేవలం ఏసు కరుణ కారణంగానే కోట్లకొద్ది ప్రజలు క్రీస్తుపేరు స్మరిస్తున్నారు. ప్రపంచంలో బుద్ధదేవునికి జయజయ ధ్యానంచేసే ప్రజలు 40కోట్ల మంది యున్నారు. వారు బుద్ధదేవుని కరుణ కారణంగానే అలా స్మరిస్తున్నారు. నేడు కోట్లకొద్ది ప్రజల మనస్సులమీద, జీవితం మీద, మరణంమీద దేనిప్రభావమైనా అధికంగా యుండంటే అది కరుణ ప్రభావమే నని చెప్పవలసి యుంటుంది.

కరుణ ప్రభావం మరుగున పడిలేదు. దేశదేశాల ప్రభుత్వాలు తమ దేశ సమ్మతిద్వారా తమ దేశాన్ని పాలించుకుంటూ, తమదేశాన్ని బలపరచడం గురించి ఆలోచించే టప్పుడు అవి కరుణా ప్రచారం చేయడంలేదు. సైనికశక్తిని ప్రచారం చేస్తున్నాయి. పాకిస్తాను ప్రభుత్వపు ఖర్చు 100 కి 70 పాళ్ళు సైన్యంమీద ఖర్చవుతోంది. దానిమీదనే తమదేశం బలపడుతోందని అనుకుంటున్నారు. మా రక్షణకు, దేశాన్ని బలంగా చేయుటకు మీరేమి చేస్తున్నారు అని మన దేశప్రజలు గూడ ఇచటి ప్రభుత్వాన్ని అడుగుతున్నారు. మననాయకులు, తాము అప్రమత్తులమై యున్నామని, ఈప్రశ్నలు విస్మరించడం లేదనీ, ఐతే కేవలం తాత్కాలిక దృష్టితో పనిచేయడం ఉచితం గాదని, దూరదృష్టిలో పనిచేయాలనీ, ఇతర దేశ సేవా కార్యాలుగూడా ఉన్నాయనీ, వాటియెడల ఉదాసీనభావం వహించలేమని నచ్చచెప్పు తున్నారు. తమ మనస్సులలో, హృదయాలలో కరుణ

అంటే ఎంతో ఆదరము గల మననాయకులీ విధంగా చెబుతున్నారు.

## శక్తిని ఆరాధించుట :

ఈ సంవత్సరము బుద్ధదేవుని 2500-వ జయంతి. ప్రపంచంలోని యెన్నో దేశాలలో యీ ఉత్సవం జరుపబడుతోంది. మన దేశంలో సర్వశ్రేష్ఠ కారుణ్యమూర్తి జన్మించారని మనకు చాలా గర్వము, అభిమానము. ఈవిధంగా ఒకవైపు కరుణ అంటే మన మనస్సుల్లో ఆదరముంది. రెండవవైపు పటిష్ఠత కొరకు శక్తిదేవత పూజ! ఇలా ఆలోచించే మనము కపటులమా? కపటులం కాదు. కాని మన మనస్సుల్లో వ్యక్తిగత జీవితోన్నతికి కరుణ శ్రేష్ఠమైనదే కాని, సమష్టి కళ్యాణమునకు శక్తి అవసరము అని అభిప్రాయము యేర్పరచుకున్నాము. ఇది వైజ్ఞానికయుగం. అందుచేత సామూహిక సిద్ధికే యెక్కువ విలువయున్నది. వ్యక్తిగత ఔన్నత్యపు విలువ గౌణమైనది. కనుకనే కరుణ, దయ మొదలగు గుణాల మహాత్మ్యము గుర్తింపబడుతున్నప్పటికీ ఆ గుణముల రాజ్యము సాగుటలేదు.

## వర్తకులకు అవకాశము :

ఇప్పుడు భారతీయ వర్తకులకు అవకాశం వచ్చిందని మా భావన. వారు సాధారణంగా దయాభావ ప్రేరితులు. వారు మాంసాహారాన్ని త్యజించారు. వారు ఈ పనికి తగినవారు. కరుణా రాజ్యాన్ని స్థాపించే పని భగవంతుడు వారికొరకు అట్టె

పెట్టాడు. కాని దయాభావంచే ప్రేరితులైన వర్తకులు స్వీయ రక్షణ కొరకు కాపలాదారులను పెట్టుకొంటున్నారు. కరుణలో స్వీయరక్షణకు తగు సామర్థ్యము లేదా ? కరుణావంతులగు వారికి గూడా ఈ విధముగా రక్షణ కల్పించుకొనవలసిన ఆవశ్యకత యెందుకు కలుగుచున్నది ? వారి జీవితంలో కరుణాగుణపు సామ్రాజ్యము లేదు కనుకనే యిది జరుగుచున్నది. ఇతర గుణములతో పాటు కరుణాగుణము గూడ కొద్దిగా కలిసియున్నది. ఇరుగు పొరుగునుండేవారి సేవలో తన సంపదను, బుద్ధినీ, శక్తినీ, వ్యవస్థాగుణాన్నీ వినియోగించే వర్తకుడు స్వీయరక్షణకు సిపాయిని పెట్టుకోవలసిన అవసరం ఏమిటి ?

## మహావీరుడూ కావాలి, సువర్ణమూ కావాలి :

బీహారులో ఒకచోట మేము జైనుల మందిరంచూడ వెళ్లాము. అక్కడ మహావీరస్వామిమూర్తి యుంది. జైలులో ఒక ప్రాకారము తరువాత మరొక ప్రాకారము దాటవలసి వచ్చినట్లే చాలా ప్రాకారములు, ద్వారములు దాటి మూర్తి దర్శనము కొరకు వెళ్ళవలసి వచ్చినది. జైలువద్ద చేత తుపాకి పుచ్చుకొని ద్వారమువద్ద కాపలావాడు నిలుచున్నట్లుగానే ఈ దేవాలయపు ద్వారములవద్ద చేత తుపాకి పుచ్చుకొన్న కాపలాదారులు నిలుచుని యున్నారు. ద్వారములన్నీ మూసి యుండెను. మాకొరకు ఒక్కొక్క ద్వారమే తెరుస్తూ ప్రత్యేకముగా మమ్ము లోనికి తీసుకు వెళ్ళారు. అక్కడ మహావీర స్వామి నగ్నమూర్తి ఉంది. శీతోష్ణాదులనుండి రక్షింపబడుటకు

గూడ బట్టకట్టుట ఉచితంగాదనుకున్న మహాపురుషుని దర్శనార్థము వెళ్ళవలసి వచ్చినప్పుడు మూయబడిన ద్వారములు, వాటివద్దగర కాపలాదారులు-దాటుకుని వెళ్ళవలసి వచ్చినది. నిర్భయంగా, నిస్సంకోచంగా అడవులు, కొండలు అనక బీహారంతా పర్యటించే ఆ ముక్తాత్మను ఈ విధంగా బందీచేయవలసిన అవసరం ఏమి కలిగిందో? లోపల చాల భాగంలో సువర్ణమయ శృంగారముండుటే దీనికి కారణం. మహావీరస్వామి ఆ సువర్ణ సంగ్రహమునకు ఎంతమాత్రము ఇష్టపడడు. వారి శిష్యులు వారి కరుణకు లొంగిపోయారు. కాని ప్రపంచంలో సువర్ణ సామ్రాజ్యం సాగుతుందని అంగీకరించడంద్వారా సువర్ణ ప్రతిష్ఠను వారు వదిలిపెట్టలేరు. నేడు ప్రపంచంలోకల్లా శక్తివంతమైన దేశమనుకుంటున్న అమెరికాలో ప్రపంచమంతటిలోని సగం బంగారం యుంది. అంటే మనం మహావీరస్వామినీ కోరుతున్నాము, బంగారాన్నీ కోరుతున్నాము! ఈ రెండింటి యెడల మన నిష్ఠ ఒకేమాదిరిగాయుంది. రెండింటిలో వైరుధ్యాన్ని మనం చూడలేము. కనుకనే అచ్చట తుపాకి కలిగిన కాపలాదారుని యుంచవలసి వచ్చినది. మహావీరమూర్తి దర్శనం చేసుకుంటునప్పుడు వారికండ్లనుంచి కన్నీరు కారుతోందా అనిపించింది. ఎక్కువ సమయం మేమక్కడ నిలవలేకపోతిమి. అత్యంత ఖిన్నులమై తిరుగుముఖం పట్టాము. వెళ్ళింది, మహాపురుషుల దర్శనార్థం. కాని దర్శనమైంది మన దురదృష్టము!

కరుణ నంగీకరిస్తున్నప్పటికీ రక్షణఅనే ప్రశ్న వచ్చినప్పుడు శక్తిదేవత స్మరణం యెందుకు కలుగుతోందా యనునది ఆలో

చించవలసిన విషయం. మనజీవితాన్ని మనం కరుణామయం చేసుకొనకపోవుటయే ఇందుకు కారణము. భారతదేశ వర్తకులు ఈవిషయాన్ని ఆలోచించాలి. దీన్ని గురించి ఆలోచించగలిగే శక్తి వారికుంది. మాకెంతోమంది వ్యాపారస్థులగు మిత్రులున్నారు. వారిలో ఎంతో ఆధ్యాత్మిక వృత్తి, దయాభావం ఉన్నట్లు మాకు తెలుసు. నేడు సమాజ నిర్మాణంలో కొద్ది కారుణ్య కార్యము చేసి వారు సంతృప్తి పడరాదు. కరుణ పునాదులపై ఆధారపడ్డ సమాజాన్ని నిర్మించే సాహసం వారిలో యుండాలి. భారతీయ వ్యాపారస్థులలో కరుణా భావం ఉండనే యున్నది. దానితోపాటు ప్రపంచ వర్తకుల గుణమగు వ్యవస్థాశక్తి కూడ యున్నది. ఈ రెండు శక్తులూ వీరిలో సమ్మిశితం కావడంచేత వారిపై భగవంతుడు పెద్ద బాధ్యత పెట్టాడు. వ్యవస్థాశక్తి, దయాభావము ఈరెండూ సమ్మిశితమైనప్పటికి గూడా కరుణారాజ్యస్థాపన జరుగకపోతే, హైడ్రోజన్ - ఆక్సిజన్ కలిసినప్పటికీ నీరు పుట్టదు.

## రండి! దేశాన్ని, లోకాన్ని రక్షించండి!

నేడు మేము భారతదేశంలోని వ్యాపారస్థులను ఆహ్వానిస్తున్నాము. ఓ వ్యాపారస్థులారా! రండి! మీలో ధర్మనిష్ఠ వుంది. శాస్త్రకారులు మిమ్ము నమ్మియున్నారు. మీలోవున్న గుణాలను ఉపయోగించి ప్రపంచాన్ని రక్షించండి. మీరు ప్రజల సేవకులుగా ప్రజల మధ్యకు వెళ్ళండి. మీరు సేవలో ఆహుతి కండి. భారతదేశంలో యీ విధంగా పనిచేసిన వైశ్యు

డొకడు అవతరించాడు. నేడు కోట్లకొలదీ ప్రజలు ఆయనను స్మరిస్తున్నారు. ఆయన ఆదినుంచి అంతంవరకు తాను వైశ్యుణ్ణని మరవలేదు. కరుణా కార్యాలు భారతదేశము కొరకు ఆయన చెయ్యనివంటూ యేమి ఉన్నాయి గనుక? ఆయన యెవరు అనునది మనం చెప్పలేము. బ్రాహ్మణుని వలె పవిత్రులు, క్షత్రియునివలె నిర్భయులు, వైశ్యునివలె కరుణా మయులు, శూద్రునివలె సేవామయులు. నా ప్రియసోదరులారా! ఆయన యీ విధంగా ఉంటూగూడా అన్నిటికంటె మించి ఆయన యేదైనా అయితే కోమటి. ఆయన గోరక్షణ కార్యముచేశారు. ఖాదీకి ప్రతిష్ఠ తెచ్చారు. గ్రామ పరిశ్రమలకు ప్రోత్సాహమిచ్చారు. చర్మ పరిశ్రమలో స్వయంగా పాల్గొన్నారు. అన్ని పనులూ దేశవాసుల కొరకు నేర్పరితనంతో చేశారు, చేయించారు. మహాత్మాగాంధీని మించిన వ్యక్తి మనలో ఉన్నారని చెప్పేవారు భారత దేశంలోగాని, ప్రపంచంలోగాని యెవరుంటారు గనుక? వారి పేరిటకూడ వ్యాపారస్థులను ముందుకు రమ్మనమని, దేశాన్నీ, ప్రపంచాన్నీ రక్షించమని ఆహ్వానిస్తున్నాము. మన దేశంలోని వర్తకులు, వైశ్యధర్మాన్ని గుర్తించేట్లయితే వ్యవస్థా శక్తిని, కరుణా బుద్ధిని అందరి సేవలో నిమగ్నం చేస్తే మన దేశ ప్రభుత్వం గూడ అత్యంత నిర్భయురాలౌతుంది.

## "ప్రైవేటు" మరియు "పబ్లికు" సెక్టర్లు :

నేడు సోషలిస్టు సమాజాన్ని నిర్మించాలని దాని కొరకు ప్రైవేటు సెక్టర్ (వ్యక్తిగత విభాగం) తగ్గించి, పబ్లిక్ సెక్టర్

(సాంఘిక విభాగం) పెంపొందించాలని అంటున్నారు. అంటే సమిష్టి పరిశ్రమలు పెరుగుతూ వ్యక్తిగత పరిశ్రమల విలువ తగ్గాలి. మాకు యీ తేడాయే అర్థంకావడంలేదు. సర్వోదయంలో యీ విధమైన అభిప్రాయానికి అసలు విలువలేదు. మొదటిసారిగా యీ రెండు సెక్టరులకు సంఘర్షణ యున్నదని విన్నప్పుడు నాకు చాలా ఆశ్చర్యం వేసింది. చేతితో చేసే పనులకు యెక్కువ విలువ యున్నదా, వ్రేళ్ళతో చేసే పనులకు విలువ యెక్కువ వున్నదా అని యెవరైనా అడుగుతారనుకోండి. అలాంటి ప్రశ్నకు మనం యేమి సమాధానం చెబుతాము కనుక ? మన ఈ చెయ్యి పబ్లికు సెక్టరు, చేతివ్రేళ్ళు ప్రైవేటు సెక్టరు. చేతితో చేసేపని వ్రేళ్ళదీ అవుతుంది. వ్రేళ్ళతో చేసేపని చేతులదీ అవుతుంది. ఈ రకమైన తేడా యెలాగు వచ్చిందో మాకు తెలియదు. వ్యాపారుల కరుణా బుద్ధి, వ్యవస్థాశక్తి ప్రజల సేవలో నిమగ్నం చేస్తే వారు చేసే వ్యక్తిగత పనులన్నీ సామాజిక (పబ్లికు) కార్యములు కాగలవు.

మానవుడు దానపరాయణుడని, తన సంపదను నిరంతరం సేవా కార్యములలోనే వినియోగిస్తాడని, అట్టివాడు చేసిన ధన సంచయం యెవరికీ ఈర్ష్యనుపురిగొల్పదనీ వేదదేవుడు ప్రాశాడు. అప్పుడు ఆ సంపదను రక్షించుకొనుటకు తుపాకీ పట్టిన కావలా వారిని పెట్టుకోవలసిన అవసరం రాదు. ఆ ధనసంచయం తమ బ్యాంకు అని ప్రజలనుకుంటారు. ఇరుగు పొరుగునుండే మొత్తం ప్రజలందరు దానిని రక్షిస్తారు. అందుచేత ఈ పబ్లిక్, ప్రైవేట్లనే తేడా కల్ల. ప్రభుత్వం సోషలిష్టు సమాజాన్ని నిర్మించే విషయమై చెబుతూందంటే భారతదేశంలోని కరుణామయులగు వ్యాపార

స్థులు భయపడవలసిన అవసరంలేదు. వర్తకులు ముందుకు వచ్చి 'మీరేమి సోషలిష్టు సమాజాన్ని నిర్మిస్తారు? ఆ నిర్మాణం చేసేది మేమే. మా మొత్తంవర్తకమంతా సేవగా భావించి చేస్తాము. మా లెక్కలు దమ్మిడీ దమ్మిడీకి ప్రజలముందు పెట్టగలము. పొట్ట గడవడంకొరకు కావలసిన జీవనభృతిని మాత్రమే తీసుకుంటాము. అంతకంటె యెక్కువ తీసుకోము. ఆ జీవనభృతికి తీసుకొనే డబ్బుకు కూడా లెక్కలు ప్రజలముందు పెట్టి వానిపైగూడ ప్రజలు చేసే విమర్శలు స్వీకరించగలము. ఆ విమర్శలలో దిద్దుకో వలసినవి ఉంటే తప్పక దిద్దుకుంటాము' అని చెప్పాలి.

## వ్యాపారులలోని మూడు గుణములు :

కొందరు మనుష్యుల నడుగుతున్న ప్రశ్నలను చూస్తే మాకు ఆశ్చర్యము కలుగుతోంది. భారతదేశంలో వ్యక్తిగత యాజమాన్యం యుండకపోతే వ్యాపారులకు పెట్టుబడి పెట్టాలన్న ప్రేరణ కలుగుతుందా? పరిశ్రమలన్నీ జాతీయంచేస్తే అందు వ్యాపారులు సహకరిస్తారా? తమ ప్రేరణతో, ఆలోచనతో, స్వార్థంతో నేడు పెట్టుబడి పెడుతున్నట్లు యిక ముందుగూడ పెట్టుబడి పెడతారా! ఈ విధంగా ప్రశ్నిస్తూ బిర్లా, టాటావంటి మహాపురుషులు వారికి స్వార్థ ప్రేరణ కలిగినప్పుడు మాత్రమే పెట్టుబడి పెడతారని నచ్చచెప్ప జూస్తున్నారు. ఈ విధంగా అనడం ఆ మహాపురుషులపై నిందమోపడమని మేము అను కుంటున్నాము. శాస్త్రకారులు వర్తకులు - వ్యాపారులనుండి అపేక్షించు చున్నట్లుగానే, తమ యెడల శాస్త్రకారులు

చూపిన నిష్ఠను గుర్తించి వ్యవహరించేట్లయితే మహాత్మాగాంధీకి వచ్చిన ప్రతిష్ఠ కంటె వీరికి రాబోయే ప్రతిష్ఠ తరగదు.

"మీరు మాట్లాడుతోన్న దాన్ని బట్టి చూస్తే మహాత్మా గాంధీ అభిప్రాయాలకు అనుగుణ్యంగా బిర్లా వంటి సేటులు ట్రస్టీలయ్యారా" అని మమ్ము అడగవచ్చు. ప్రత్యేకముగా వ్యక్తులను పరీక్షించడం నా పనిగాదని నేనంటున్నాను. బిర్లా హృదయంలో సజ్జనత్వం, కరుణ తగినంతగా యున్నాయని నాకు తెలుసు. పరమేశ్వరుడు నన్నీ విషయాలు చెప్పేందుకు ప్రేరేపిస్తున్నాడు గనుక వారినీ ఈ పనిచేయుటకు ప్రేరేపించ గలడని నేను ఆశిస్తున్నాను.

ఈ విధంగా నేను ఒక పెద్ద వ్యాపారితో ఒకసారి మాట్లాడాను. "మహాత్మాగాంధి మీరు ట్రస్టీలు కావాలని, మీ వ్యవస్థాశక్తి, సంపద, బుద్ధి సేవలో యుపయోగించాలని, మీ కరుణావృత్తిని వినియోగంలోనికి తేవాలని, మీ నుంచి ఆశిస్తూ యుండేవారు" అని నేను వారితో అన్నప్పుడు ఈ విష యం తమ కేమీ కష్టమైనది కాదు అని ఆ సోదరుడు అన్నారు. దీనికి ఒక చక్కని కారణాన్ని ఆయన చూపారు. "ప్రపంచం లోని ఇతర వ్యాపారులు భోగ విలాసాలలో ఉంటూన్నట్లుగా మేము యుండడంలేదు. మా జీవితం ఎంతో నిరాడంబరంగా సాగుతోంది" అని వారన్నారు. వారు చెప్పిన ఈ విషయం సరియైనదే. సామాన్యుల యిండ్లలోని అలంకరణల వలెనే తమ యిండ్లలోనూ సామాన్యంగానే అలంకరించుకునే వ్యాపారుల నెందరినో నేను చూశాను. ఫలానావ్యక్తి కోటీశ్వరుడు అని

గుర్తించుటకు వీలు లేనంత నిరాడంబరంగా వారు యుంటు న్నారు. ఇది భారతీయవర్తకులలోని ప్రత్యేకత అని వారన్నారు. వారు ప్రపంచమంతా తిరిగినవారు. నాకు అంతకుముందు ఈ విషయం గురించి పరిచయంలేదు. కాని ఆ తరువాత దరియాప్తు చేయగా వారు చెప్పిన ఈ విషయం యథార్థమేనని తేలింది. మనదేశపు వ్యాపారులలో కరుణ, వ్యవస్థాశక్తిమాత్రమే గాక నిరాడంబరత కూడ యున్నది. ఈవిధంగా మూడేసి గుణాలు సమ్మిళితమైనచోట కరుణారాజ్యాన్ని స్థాపించితీరగలరు.

## మీకూ మాకూ పోటీ పడింది !

నేను ఒక్కొక్క భూమి కలిగినవాని వద్దకూ వెళ్ళి భూమిని అడుగుతున్నానని మీకు తెలుసు. కాని ఒక్కొక్క వర్తకుని వద్దకూ నేను వెళ్ళడంలేదు. ఎందుచేతనంటే భూమి కలిగిన వారు స్వయంగా అభిప్రాయాలను అర్థం చేసుకో గలిగే స్థితిలో లేరు. వర్తకులు అభిప్రాయాలను, తత్వమును అర్థం చేసుకుంటారు. అందుచేత ఇలా నేను పనిచేసుకుంటూ వెళ్తూ ఉంటే వర్తకులు సహజంగానే అన్నీ తెలుసుకో గలరు. తరగతిలో వెనుకబడ్డ విద్యార్థులకు ఎక్కువగా పాఠం నచ్చచెబుతూ ఉంటే తెలివిగల విద్యార్థులు సహజంగానే తెలుసుకుంటారు. భారత దేశంలో వర్తకులు ఎప్పుడు రంగంలోనికి దిగుతారా, ఎప్పుడు నా యీ పనిని వారు తమ బాధ్యతగా తీసుకుంటారా అని నేను ఎదురు చూస్తున్నాను. "భూమి సేకరించే పని నీకు బాగా కుదిరింది అందుచేత నువ్వు ఆ పనిచెయ్యి. నీవు సేకరించిన

భూమి నంతా చదును చేసి, దున్ని, పంట పొలాలుగా మార్చే బాధ్యత మాది; ఇక రానీ, నీకూ మాకూ పోటీ! ఇంతవరకూ వచ్చింది 25 లక్షల ఎకరాలా. కానీ, అంతా సరిచేసి ఇస్తాము,'' అని మీరు నాతో ఎప్పుడంటారా అని ఎదురు చూస్తున్నాను.

భారత దేశంలోని వర్తకులలో ఈ స్ఫూర్తికనుక కలిగిందంటే భారత దేశంలో కరుణారాజ్య స్థాపన జరుగుతుందో లేదో చూడండి; దాని ప్రభావం పాకిస్తానుపై పడుతుందో లేదో చూడండి. దాని ప్రభావం విశ్వశాంతిపై పడుతుందో లేదో చూడండి. దాని పరిణామంగా ఆయుధ బలాల విలువ పడిపోతుందో లేదో చూడండి.

## భారతీయ సంస్కారము :

ప్రపంచ ప్రజలను జయించాలని జర్మనీవారు కోట్లకొద్ది ప్రజలను బలిదాన మిచ్చారు. ఎంతో డబ్బు ఖర్చుచేశారు. ఆ బలిదానం, ఆ డబ్బు, ఆ వ్యవస్థలతో ప్రపంచానికి సేవ చేయ వారు బయలుదేరియుంటే, వారు ప్రపంచానికి యజమానులై యుండేవారు. హింసాశక్తిని పెంపొందించుటకు ఇంత వ్యవస్థాశక్తి, డబ్బును ఖర్చుచేశారంటే ఆశ్చర్యం వేస్తోంది. ఇదంతా పొరుగు దేశాలను జయించాలని చేశారు; అయినా వారు వాటిని జయించలేక పోయారు. జర్మనీవారు దయాభావ ప్రేరితులై ప్రపంచ సేవ చేసి యున్నట్లయితే ప్రపంచం వారిని స్మరించేది. కరుణా రాజ్యాన్ని స్థాపించాలనే భావన ఎక్కడైనా కలుగుతుందంటే అది భారత దేశంలోనేననీ, ఆ పనికి ఎక్కడైనా

ప్రారంభం జరుగుతుందంటే అది భారతదేశంలోనేననీ మా నమ్మకము. యాజమాన్యం తొలగించాలని మేము చెబుతూవుంటే, ప్రపంచంలో నుంచి 50 సంవత్సరాలకైనా అది జరుగుతుందా అని అడుగుతున్నారు. 50 సంవత్సరాలలో ప్రపంచంలో యాజమాన్యం తొలుగుతుందని మాకు నమ్మకంలేదు గాని, అట్టి విషయం భారతదేశంలో జరుగుతుందని నమ్మక ముంది; ఎందుచేతనంటే ఇచ్చటి సంస్కారములే అట్టివి. తమ సామ్రాజ్యాలను గడ్డిపోచతో సమానంగా కాలదన్ని వెళ్ళిపోయిన వారు ఈ దేశంలో ఉన్నారు.

## భూదానాన్ని భర్తీ చేసే భారం వహించండి :

రామచంద్రునికి రాజ్యాభిషేక మన్నారు. కాని చివరకు ఆయన వనవాసమునకు వెళ్లాలని నిశ్చయం జరిగింది. ఆయన కౌసల్యామాతను కలుసుకోను వెళ్లారు. "హే! వత్సా! నీరాజ్యాభిషేక వార్త విన్నప్పుడు నాకెంత సంతోషం కలిగిందో గదా" అని ఆమె అంది. అపుడు శ్రీరామచంద్రులు "హే మాతా! నాకు వనరాజ్యం లభించింది. ఆశీర్వదించు" అన్నారు. తల్లికి దుఃఖమనిపించింది. అయితే అది క్షణమాత్రమే. వెంటనే ఆమె యిలా అన్నది : "రాజాజ్ఞ అలా అయితే, నీ రెండవ తల్లి కోర్కె అదే అయితే నువ్వు తప్పక వెళ్లు." ఆ వెనువెంటనే మరొక వాక్యం ఆమె యిలా అన్నది! "రాజవంశంలోని వారు ఎలాగూ చివరిక్షణాల్లో వనమునకు వెళ్లాలి గదా. అయితే లేడా అల్లా నువ్వు ఇప్పుడే వెళ్ళవలసివస్తోంది."

ఇదీ మన సంస్కృతికి ఆదర్శము. ఈ ఆదర్శాన్ని ప్రపంచంలో నిరూపించవలసిన బాధ్యత వైశ్యులది. ప్రేరణ కలిగించే పని బ్రాహ్మణులది. ఈ మహిమాన్విత కార్యాన్ని మన ఆచార్యులు లోగడే చేశారు. అయితే దానికి సాకార రూపమివ్వడం మూర్తీభవింపజేయడం వర్తకుల పని అందుచేత వర్తకుల వద్దకు వెళ్ళి మీ రెంత సంపత్తిదాన మిస్తారని మేము అడగడంలేదు. వారినుంచి చాలా పని కోరుతున్నాము. బాబా సేకరిస్తున్న భూదానాన్ని భర్తీచేసే భారం వ్యాపారస్థులు వహించాలని కోరుతున్నాము. దీనివల్ల వ్యాపారస్థుల ప్రతిష్ఠ పెరుగుతుంది.

## తప్పు ఎక్కడుంది ?

వ్యాపారస్థులు లేకుండా జీవితం సాగదు అని అందరికీ తెలుసును. వ్యాపారులు యిక్కడ సామాను అక్కడికీ, అక్కడ సామాను యిక్కడికీ పంపుతూ ఉంటారు. దీనివల్లే జీవితం సాగుతుంది. ఇంత చేస్తున్నా యీరోజున భారతదేశంలో వ్యాపారస్థులకు తిట్లే తగులుతున్నాయి. శాస్త్రకారులు వారికింత ప్రతిష్ఠ నిచ్చారు. వారు లేకుండా ఏపనీ సాగదు. వారి మనస్సులో కరుణ ఉంది. వారిలో నిరాడంబరత ఉంది. ఐనప్పటికీ వారికి తిట్లు తప్పడంలేదు. తప్పెక్కడున్నదో ఆలోచించుకోవాలి. వత్తి ఉంది, నూనె ఉంది. ముట్టించకపోతే దీపం వెలగదు, వెలుతురు రాదు. విద్యుచ్ఛక్తి ఇంటిలోకి వచ్చింది. స్విచ్ నొక్కలేదు. అందుచేత చీకటిక్రమ్మి ఉంది. గుణవంతమగు వైశ్యసమాజం భారతదేశంలో ఉండగా నాకు చింత ఎందుకు ?

బాబా చేయగా మిగిలిన పనిని మన దేశవర్తకులు చేయ పూనుకుంటారని, దానిని భర్తీచేయుటకు అవసరమైనవన్నీ చేస్తారని మాకు పూర్తి నమ్మకముంది. కాని ఈ రోజున వారే మా వద్దకు వచ్చి డబ్బు యివ్వాలనుకుంటున్నారు. మేము బ్రాహ్మణులమనీ, అమాయకులమనీ, డబ్బు నుపయోగించడం మాకు తెలియదనీ మేమంటున్నాము. అందుచేత మీరు డబ్బు తోనూ, కరుణతోనూ, వ్యవస్థాశక్తితోనూ, నిరాడంబరతతోనూ రండి. ఈ భారం మీద వేసుకోండి. డబ్బిచ్చి మాకు అనవసరంగా చెడుపేరు తీసుకురాకండి. ఎద్దు చేసేపని గుఱ్ఱము వల్ల గాదు. పొలములో పని చేయాలంటే ఎద్దే కావాలి. వేగంగా పరిగెత్తా లంటే గుఱ్ఱమే కావాలి. బాబా గుఱ్ఱము, మీరు ఎద్దు. ఈ గుఱ్ఱము అశ్వమేధ గుఱ్ఱము వలె పర్యటిస్తూ పర్యటిస్తూ ప్రతిచోటుకు వెళ్ళి భావ ప్రచారం చేస్తుంది. ఐతే సేకరింపబడిన భూమిని మంచిభూమిగా చేయడం మీ వ్యాపారస్థుల పని.'

## అపూర్వ అవకాశము :

భారతదేశములోని వ్యాపారులకు ఇప్పుడు ఒక సదవకాశము వచ్చింది. మహాత్మాగాంధీజీ వ్యాపారుల నుంచి ఎంతో ఆశించారు. తన ప్రియమైన జాతివాళ్ళు ఏమి చేస్తున్నారని గాంధీజీ ఆత్మ తొంగిచూస్తోంది. భూదాన యజ్ఞం ద్వారా యాజమాన్యాన్ని తొలగించే మహాయజ్ఞం ప్రారంభమైంది. ఇట్టి స్థితిలో కరుణాప్రేరితమగు వైశ్యవృత్తి చేసేవారికి కరుణా రాజ్యాన్ని నిర్మించే అవకాశం కలుగుతోంది. ఎంతో విశ్వాసంతో భారతీయవ్యాపారులకు మేమీ పిలుపు నిస్తున్నాము.అందుకోండి!



# వైశ్య ధర్మము

హిందూమతం ఒక విధానంలో సమాజ వ్యవస్థను ఏర్పరచి, ప్రజలకు చేయవలసిన పనులను పంచింది. అందు వ్యవసాయము, వాణిజ్యము, గోసేవ వైశ్యధర్మాలుగా పేర్కొనబడినవి.

ఏ కార్యాచరణార్థం మానవుడు శరీరాన్ని ధరిస్తాడో అది ధర్మము. ధర్మము అందరి మేలుకొరకూ ఏర్పడింది. ఇట్టి ధర్మమును అంగీకరించిన వ్యక్తి అవసరం వచ్చినప్పుడు ఎంతటి త్యాగానికైనా వెనుదీయడు. కుటుంబంలో ఉండేవారందరూ పరస్పరం ఒకరికొరకు మరొకరు త్యాగం చేసుకుంటారు కనుకనే వారికందు ధర్మాచరణ సంతృప్తి కలుగుతుంది. అట్లుకాకపోతే మనస్థితి పశువులకంటే హీనమైపోయేది. ఈ కుటుంబ వ్యవస్థ మనలను పశుస్థితికి పోకుండా ఆపింది. అదేవిధంగా ప్రతీవ్యక్తికీ ఒక సాంఘిక ధర్మము నిర్ణయించబడింది. అందు వ్యవసాయం, గోసేవ, వాణిజ్యంద్వారా సమాజసేవ చేయడం వైశ్యుల ధర్మంగా పేర్కొనబడింది.

కాని వైశ్యులు వ్యవసాయం, గోసంరక్షణ కష్టమని వదిలివేశారు. ఆతర్వాత ఈ పనికి అవసరమగు శరీరశ్రమ మాత్రం చేయగలిగి శాస్త్రీయ దృష్టి లేనటువంటివారికి ఈ పనులను అప్పగించారు. ఇట్టివారు పోను పోను ఒక వర్గంగా తయారయ్యారు. వీరిని కూడా శూద్రులుగానే పరిగణించ సాగారు.

పూర్వకాలంలో వైశ్యులు సమాజానికి నిజంగా సేవ చేసేవారని నా అభిప్రాయం. వారు తమ ధనాన్ని, తమ బుద్ధినీ— అంతటినీ సమాజసేవలోనే నిమగ్నం చేసేవారు. అందుచేతనే వారిని 'మహా -- జను'లన్నారు. సమాజమందు వర్తకులకు మంచి ప్రతిష్ఠ ఉండి ఉండకపోతే వారిని 'మహాజను' లనుట సంభవించి యుండేది కాదు. వారు సేవాపరాయణులు, సత్యనిష్ఠులు అయియుండకపోతే వారి కీపదవి లభించేదికాదు.

అయితే వ్యవసాయం, గోసంరక్షణ అనుధర్మాలను వారు వదిలినప్పటినుండీ వారి తేజస్సు క్షీణించసాగింది. అయినా సమాజమందు ఈ రెండు కార్యాలూ చక్కగా నిర్వహించిన వారికీ, వైశ్యులకూ మధ్య సంబంధ బాంధవ్యాలు మాత్రం చక్కగా ఉండేవి. కాని రాను రాను శరీరశ్రమచేసేవారు హీను లుగా ఎంచబడడం ప్రారంభమైంది. ఆంగ్లేయ వర్తకులు ఈదేశం వచ్చునరికి ఇచ్చటి పరిస్థితినంతా వారు అవగతం చేసుకున్నారు. వర్తకులు రైతులను తక్కువగా చూస్తున్నారనీ, రైతుల చేతి వంట - నీరు వీరు ముట్టరనీ ఆంగ్లేయులు గమనించారు. ఎంతో దూరంనుండి వచ్చిన ఆంగ్లేయులకు ఒక చక్కని సదవకాశం లభించింది. దాంతో వారు తమ వర్తకం ప్రారంభించారు. నెమ్మది నెమ్మదిగా ఇచ్చటి వర్తకమంతా మనదేశీయుల చేతుల్లో నుంచి తెల్లవర్తకుల చేతుల్లోకి వెళ్లిపోగానే వారిక్కడ తమ సైన్యాన్ని తెచ్చిపెట్టారు. ఆపైన జరిగినస్థితి మీకు తెలుసు.

ఈవిధంగా ప్రావీణ్యం పోగొట్టుకొనుట, కళాకారులనూ, శిల్పులనూ హీనులుగా చూచి వారిని పీడించుటవలన వర్తకుల

నుండి వర్తకం పోయి కేవలం కమీషనుకై జరుపు మధ్యవర్తిత్వం మాత్రం వారివద్ద మిగిలింది.

నేడు వర్తకులు నలుపు - తెలుపు - అన్ని విధానాల ద్వారా డబ్బు సంపాదించి కొంత దానం కూడ చేస్తున్నారు. అయినా దేశంలో వారంటే గౌరవంలేదు, వారియెడల ఎవరూ ఆదరాన్ని చూపరు. సరుకులు కొనుక్కొనుటకు వచ్చిన పసి బాలుణ్ణి కూడ మోసం చేయకుండా ఉండలేని వర్తకుల దేశం ఎలా అభివృద్ధి చెందగలుగుతుంది?

## శంక - సమాధానము

ప్రశ్న : లాభం పరిమితి ఏమి ?

సమాధానము : 'గీత' ప్రకారం వాణిజ్యాన్ని ఒక ధర్మం అనుకుంటే ఇక లాభమనే ప్రసక్తేరాదు. సాధారణ ప్రజానీకము, రైతు మన యజమానులు. మనం వారి సేవ చేయవలసియున్నది. అందుచేత రైతుగాని, కార్మికుడుగాని ఉత్పత్తి చేసే వస్తువులను మార్కెటింగు చేయునపుడు మనం కేవలం మనకయ్యే ఖర్చులు తీసుకోవాలి గాని లాభం చూడకూడదు. దేశ సంపదను ఎలా పెంచ గలుగుతామా అని ఆలోచించాలి. 8 గంటలు పనిచేసి కార్మికుడు ఒకరూపాయి మాత్రమే సంపాదించడం, వర్తకుడు 8 వేల రూపాయలు పొందడం ధర్మమా ? ధర్మంతో కూడిన వర్తకమందు లాభమూ ఉండరాదు, నష్టమూ కూడదు. తరాజు లోని శిబ్బిలవలె రెండు పక్షములూ సమానంగా ఉండాలి. కాని నేడు వర్తకులలో ధనసంచయ ప్రవృత్తి పెరిగిపోయింది. తుకారాం

చెప్పినట్లుగా ఎవరి ధన, ధాన్యాలు ఇంటింటా పంచబడి ఉంటాయో వాడే అసలైన శ్రీమంతుడు. ఎవరి జీవితాన్ని అతని ఇరుగు పొరుగువారు కోరుతూ ఉంటారో అట్టివాడు నిజమైన ధనవంతుడు. ఎవరిని ప్రజలు కోరరో అట్టివాడు బికారి.

కబీరు చెప్పినట్లుగా పడవలోనికి నీరు వచ్చినప్పుడు ఒక్క-చేత్తో కాక, రెండు చేతులా బయటకు పారబోసినట్లే ఇంట్లో చేరిన ధనాన్ని కూడ దోసిళ్ళతో దానమిచ్చి ఇంటిని రక్షించుకోవాలి. ఎవరైనా గ్రహీత లభిస్తే మనం అతనికి కృతజ్ఞులమైయుండాలి. ఫుట్‌బాల్ ఆటవలె ధనంకూడ ఆడబడాలి. బంతిని ఎవరూ తన వద్దనే అట్టే పెట్టుకోరు. వచ్చీ రావడంతోనే తన్ని వేస్తారు. ధనాన్నికూడ ఇలా 'తంతూ' ఉంటే సమాజ శరీరమందు ధనం ప్రవహించి సమాజం ఆరోగ్యంగా ఉంటుంది. సంస్కృతంలో ధనాన్ని ద్రవ్యమంటారు. 'ద్రవ్య'మంటే ద్రవించేది, ప్రవహించేది అని అర్థం. అది గనక నిలకడగా ఉండిపోతే నిలవ నీటిలో కుళ్ళువాసన వచ్చినట్లే, ఇదీ చెడిపోయి దుర్గంధ పూరితం కాగలదు.

**ఇందోరు, 18-8-48** — *వినోబా.*

---

## వర్తకులతో వినోబా

"మీరు భూస్వాములనుండి, జమీందారులనుండి భూమిని అడుగుతున్నారుగదా. మాకు కూడ ఏమైన కార్యక్రమం చెప్ప గలరా ? నేటి పరిస్థితులలో మాధర్మం ఏమిటి ?" అని ఒక వర్తకుడగు యువకుడు ఒక సభలో వినోబాను ప్రశ్నించాడు.

బాబా యిలా అన్నారు: "ఆ...హో...ఉంది. భూమి అసలు మూలసమస్య. అందుచేత ఈ 1, 2, 3 సంవత్సరాల నుంచీ దానిపైనే కేంద్రీకరించాను. ఆపైన సంపత్తిదానం ప్రారంభించాము. భుజించే ప్రతివాడూ ఇతరులకు కూడ కొంత పెట్టాలనేది దీని ఆశయము. వందరూపాయలనుండి రూపాయో, అర్థో, పావలాయో దానం చేస్తే అది ధర్మంకాదు. మీరు కర్తవ్యబుద్ధితో, విషయాన్ని గుర్తించి దానం చేయాలని నా అభిమతము. నేడు భారతదేశంలోని వర్తకులకు ఏమీ ప్రతిష్ఠలేదు, వారు నిందింపబడుతున్నారు. వ్యవసాయం ధర్మమైనట్లే. వ్యాపారమూ ధర్మమని శాస్త్రాలు చెప్పాయి. ధర్మమంటే, ప్రజలు బాధపడుతూఉంటే, చూచి ఊరుకుని మనం ఆనందించడం కాదుగదా. శ్రీకృష్ణదేవుడు వర్తకమును ధర్మమని చెప్పి, దానితోపాటు సేవ, త్యాగం కూడ కావాలని చెప్పాడు."

బాబా యింకా ఇలా అన్నారు! "నేడు ప్రజలు వర్తకులను ఎలా చూస్తున్నారు? మార్వాడీలు, షావుకార్లు అంటే నేడు ప్రజానీకంలో గౌరవభావం ఉందా? ఇంత గొప్ప సేవ చేసేవాడు నిందింప బడడం మన దురదృష్టం. ఒకానొక కాలంలో వర్తకుణ్ణి 'మహాజను' డనేవారు. గ్రామస్థులు తాము జీవితమంతా కష్టపడి సంపాదించిన ధనాన్ని వర్తకునివద్ద దాచుకుని తీర్థయాత్రలకు వెళ్ళేవారు. తిరిగి వచ్చేక తీసుకునేవారు. వర్తకుడు, వ్యాపారస్తుడు అంటే సంరక్షకుడు అని అర్థం. ప్రజలలో వారంటే నమ్మకం ఉండేది. కాని నేడు అపనమ్మకం ఆవరించింది. దాని కేదో కారణం ఉండాలి. ధర్మాచరణ కలిగియుండి నిందల

పాలు కావడం సంభవం కాదుగదా. డబ్బుకు విలువ పెరిగి, మనిషికి విలువ తగ్గి పోవుటయే ఇందుకు కారణం. దాన్నిబట్టే వడ్డీపై వడ్డీ లొచ్చాయి. లేకపోతే 60 వేల మైళ్ళ దూరాన ఉన్న వారువచ్చి ఇచ్చటి వర్తకుల వర్తకాన్ని నాశనంచేసి, తమ వర్తకాన్ని, వర్తకాన్నే కాక రాజరికాన్ని ఎలా నెలకొల్ప గలిగారు ? సరియైన అర్థంలో నేడు కూడ భారత దేశంలో వర్తకులు చాల తక్కువ. ఉన్న వారు దళారులు. నేడున్న నింద వెనుక పాపం నిండిఉంది.

"మేము వర్తకులకు ప్రతిష్ఠ నివ్వదలిచాము. భారత దేశంలోని వర్తకులవర్గం నిరంతరం సానుభూతి పూర్వకంగా తోడ్పడుతూనే వచ్చింది. వారిలో చాల దయాభావం ఉంది. వారు ధర్మాల పేర, తీర్థయాత్రలు, శ్రాద్ధములు మొదలగు అన వసర కార్యాల్లో ఎంతో ఖర్చు చేస్తారు. దానివల్ల సమాజం అభి వృద్ధి చెందదు. ధర్మమనేది నిత్యం నిరంతరం జరగాలి. మీ సంపా దన గురించి మే మేమీ అడగబోవడంలేదు. ఏదో చేసుకుంటు న్నారు. మీరు ఇంటికిగాను ఖర్చు పెడుతున్నారు గదా, అంటే తిండి, బట్ట, పిల్లల చదువు, వైద్యుని ఖర్చులు, ప్రయాణాలు, పెళ్ళి పేరంటాలు మొదలగు ఖర్చులు చేస్తున్నారు గదా. ఈ ఖర్చు నుండి ఒక భాగం ఇవ్వండి. మమ్మో మీ కుటుంబంలో ఒక సభ్యునిగా తీసుకోండి."

"నేడు ప్రతీచోటా భూమి పంపకం జరుగుతోంది. భూమి యేకాక, భూమి హీనులకు విత్తనాలు, ఎడ్లు, వ్యవసాయ పరి కరాలు ఇవ్వవలసి యుంది. వారిని భూమిపై నిలవగలుగునట్లు

చేయాలి. దానికి గాను సంపత్తిదానం చాల అవసరం. మీరు మాకు దానం చేసిన మొత్తం మీవద్దనే ఉంచుకుంటారు. కాని మేము చెప్పినట్లుగా మాత్రం ఖర్చు పెట్టాలి. మమ్ము ఇంట్లో ఒకభాగంగా గుర్తించి కార్య రంగానికి దిగండని, మీరు దీనిని ఆలోచించి, తర్కించి, ఇందు విశ్వాసం కుదిరేక దిగండని చెబుతున్నాను."

ఒక వృద్ధ వర్తకుడు క్రిందిచూపులు చూస్తూ సంశయిస్తూ "మా మీద ఇన్కం టాక్సు ఉండనే ఉంది గదా; మరల ఇది ఒక పన్నా ?" అని అడిగారు.

దానికి బాబా యిలా అన్నారు: "మీ పిల్లవాడు మీకు టాక్సు అయితే మేము కూడా టాక్సే. మీరేది తింటారో అందులోనుంచే మాకు భాగం యివ్వండని అడుగుతున్నాం. ఎక్కువ తింటే ఎక్కువ యివ్వండి. తక్కువ తింటే తక్కువ యివ్వండి. తల్లి - తండ్రీ, భార్య - పిల్లలు మీకు టాక్సు అయితే, వినోబా కూడా టాక్సే."

ఒక్కనిముషం ఆగి మరల వినోబా యిలా అన్నారు. "మీయింటి కష్టసుఖాలలో మాకు పూర్తిగా భాగం ఉంది. బాధలు, కష్టాలూ ఉండగానే కుటుంబాన్ని మీరు జరుపుకుంటున్నారుగదా. ఆకుటుంబంలో నన్నూ ఒక వ్యక్తిగా తీసుకోండి."

ఇంతలో ఒకరు "ఇంట్లో మనిషి అయితే పర్వాలేదు. మీకైతే ఎప్పుడూ తినిపించడమేగదా !" అన్నారు.

ఇది విని బాబా నవ్వి చాలా సంతోషించారు. "మీరు చాలమంచిసమస్య లేవదీశారు. కాని ఆలోచించండి. ఇంట్లోమనిషి

అయితే అతని కొరకు మీరు నష్టపడవలసి కూడ వస్తుంది. అతను కొంత దుబారా కూడా చేస్తాడు. అదే, వినోబాను మీ ఇంట ఒకమనిషి అనుకుంటే మీ గౌరవం పెరుగుతుందా ? పెరగదా ? మీ ఇంటిస్థాయి పెరుగుతుందా ? పెరగదా ? మీ అబ్బాయిచేసే పనికంటే వినోబా ఎక్కువపని చేస్తాడు." అని వినోబాఅన్నారు.

కొంతసమయం గడిచిన తర్వాత ఒక సోదరుడు లేచి "ఈ రోజుల్లో వ్యాపారం చాలా పడిపోయింది. మాస్థితి అంత అధ్వాన్నంగా మరేదీ లేదు." అన్నారు.

వినోబా యిలా అన్నారు : "వ్యవసాయదారులస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది. ధర్మం పెరిగితే మొత్తం సమాజ మంతటి పైనా దానిప్రభావం పడగలదు. ఒక విషయం మాత్రం మరవకండి. ఇవ్వదలచినవారు సంతోషంగా ఇవ్వండి, ఇవ్వనివారిని నిందించకండి. నేడు దానం చేయాలని ప్రేరణకలగని వారిని విడిచివేయండి. ఈర్ష్య - ద్వేషం రాకూడదు. విశుద్ధమైన ప్రేమ మనకు కావాలి. ఇంటింటా మా బ్యాంకు ఉందని నేననుకుంటున్నాను. డబ్బు సంపాదించేవారు మీరు, ఖర్చు చేసేవారు మీరు. లెక్కలుంచేవారు మీరు. ఖర్చు ఎలా పెట్టాలనే విషయంలో మాసూచనలు మాత్రం తీసుకుంటారు. సంవత్సరాంతాన లెక్క పంపండి. ఇదే నిజమైన ధర్మకార్యం."

ఆ తర్వాత ఎవరైనా దానపత్రం వ్రాసి ఇచ్చి ఖర్చు చేయకపోతే దేవుడే చూస్తాడనీ, తాను ఆ దానపత్రం చించి వేస్తాననీ, ఆ విషయంలో దేవునికీ, దాతకీ తిన్నగా సంబంధం ఉండగలదనీ వినోబా చెప్పారు.

ఈ వివరణవల్ల అందరికీ సంతృప్తి కలిగింది. ఒక యువకుడు లేచి "మా కుటుంబంలో మీకు భాగ మిమ్మన్నారు. నేడు ఐదుగురుంటే ఆరవభాగం ఇస్తాము: కాని రెండుమూడు సంవత్సరాలయిన తర్వాత ఇంట్లో జనాభా పెరిగి ఎనిమిదిమంది అయినా ఆరవ భాగమే ఇవ్వాలా ?" అని అడిగారు.

ఇందుకు వెంటనే వినోబా జవాబు చెప్పారు: "అక్కర్లేదు. తొమ్మిదవ భాగం ఇవ్వండి. అప్పుడు మీ ఇంట తొమ్మిదవ సోదరు డవుతాం."

దానితో అందరిలోనూ ఉత్సాహం ప్రవేశించింది.

"మీరు భూమిగలవారి నుండి భూదానం, సంపత్తిదానం రెండూ అడుగు తున్నారేమి ?" అని మరొకరు ప్రశ్నించారు.

వినోబా : ఎక్కువ ధర్మం చేస్తే నరకానికి వెళ్ళదమని భయమా ?

ఇదివిని అందరూ నవ్వారు. బాబా ఇంకా ఇలా అన్నారు: "భూమిపై యాజమాన్యం వదలుట ముఖ్యమైన విషయం. భూమి ఉత్పత్తి సాధనము. కనుక భూ కామందులకు ద్వివిధ ధర్మాలున్నాయి. అల్లే మీ వర్తక సోదరులయెడ కూడ మరొక కర్తవ్యం ఉంది. మీరు మీ వ్యాపారాన్ని నిజాయితీగా చేసుకోవాలి. ఇదీ ధర్మమే. మొట్టమొదట మీఇంట మాకు స్థానం ఇవ్వండి !"

—సురేశ్ రామ్ భాయీ.

('సత్సంగము' నుండి)

# భూదాన సాహిత్యము

| | | రు. న.పై |
|---|---|---|
| గీతా ప్రవచనములు | వినోబా | 1.00 |
| శిక్షణ విచారధార | ,, | 1.50 |
| సాహిత్యం - సాహితీవేత్తలు | ,, | 0 65 |
| ప్రజావిప్లవ పథము | ,, | 0.50 |
| వర్తకులకు పిలుపు | ,, | 0.15 |
| కార్మికులారా ! కదలండి! | వినోబా & జయప్రకాశ్ నారాయణ్ | 0.15 |
| వినోబా జీవితం | లవణం | 0.20 |
| విద్యార్థులారా రండి | ,, | 0.15 |
| సంపత్తి దానము | శ్రీకృష్ణదాస్ జాజూ | 0.50 |
| వినోబా సన్నిధిలో | నిర్మల దేశపాండే | 1.25 |
| భూదాన ఆరోహణము | నారాయణ దేశాయి | 0.75 |
| పవిత్ర సన్నివేశములు | మృదుల మూందడా | 0.50 |
| విప్లవ పురోగమనము | దాదా ధర్మాధికారి | 0.30 |

पानी बाढ़ो नाव में, घर में बाढ़ो दाम ।
दोनो हाथ उलीचिये, यही सयानो काम ॥ —कबीर

(నావలో నీరు వచ్చినా, మరి ఇంటిలో ధనముచేరినా
రెండు చేతుల బయటకు నెట్టుటే వివేకవంతుల పని గాద ।

—కబీరు)

——నావలో నీరు నిండినప్పుడు మనం ఒక్క చేత్తోకాక, రెండు చేతులతో ఆ నీటిని బయటకు నెట్టినట్లే, ఇంట్లో పెరిగిన ధనాన్ని ఇంటి బయటకు బంపి, ఇంటిని రక్షించుకోవాలి. గ్రహీతలెవరైనా మనకు లభిస్తే వారికి మనం కృతజ్ఞులం కావాలి. ఫుట్‌బాల్‌వలె ధనం ఆట సాగాలి. బంతిని ఎవరూ తనవద్దనే అట్టేపెట్టుకోరు. అది తమ వద్దకు చేరిన వెంటనే మరొకరికి విసిరివేస్తారు. ధనమునూ ఈ విధములోనే బయటకు పంపుతూ యుంటే సమాజ శరీరంలో అది ప్రవహిస్తూ ఉంటుంది. దానివల్ల సమాజ ఆరోగ్యం చక్కగా ఉంటుంది. సంస్కృతంలో ధనమును ద్రవ్యము అంటారు. "ద్రవ్యము" అనగా ద్రవించేది అని అర్థము. అది స్థిరంగా ఉండిపోతే నిలచిన నీటివలెనే దుర్వాసన కొడుతుంది.

—వినోబా